శ్రీ హయగ్రీవాయనమః.

# శ్రీ వీరహనుమత్తారావళి.

ఇయ్యది,

సకలసుధీజనవిధేయుండునగు

చిన్నకొండ వెంకటనరసింహాచార్యవర్యునిచే

రచియింపబడి,

పెద్దలచే పరిశోధింపబడి,

మల్కాపుర నివాసియగు

పిల్లలమఱ్ఱి సత్యనారాయణగారి ద్రవ్యసహాయముచే

చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి

ప్రకటింపబడియె.

గుంటూరు.

1918

వెల రు 0-1-0



ఉ॥ మారుతినం స్తవంబిడి నయోదిత భక్తి మనంబునందునన్
జేరిచి వ్రాసెగాన నరసింహుఁడు సత్కవితావిశేషముల్
నేరనివాఁడు యిందుగలనింద్యముల న్పరికించకన్ రసం
బారయ సంగ్రహించుఁడి నయాత్మసుధీవరులార! గూర్మితోన్ ।

సీ॥ శ్రీమందడాన్వయ సింధురాట్సంపూర్ణ
సోముఁడై యెవ్వాఁడు సొంపుగాంచె
ధీ సద్గుణగణాంబుధీ సమర్థతగాంచి
వసుధలో నెవ్వాఁడు వన్నెకెక్కె
రహించు మల్కాపురగ్రామమునకెల్ల
కరణమై యెవ్వాఁడు ఘనతగాంచె

సద్వ్యయాచకకోటి సంతసింపగ నవ్వ
డమితధర్మక్రియ లనుసరించె
గీ॥ నట్టి హనుమంతరావుగా రార్యహితుడు
సత్కవివిధేయు డతిభక్తి సహితముగను
దీని దిరముగ నచ్చుయొత్తింపజేసి
యతులితంబుగ కీర్తి తానవధరించె॥



# శ్రీ వీరహనుమత్తారావళి

శా॥ శ్రీ సీతారమణీశ పాదయుగ సంసేవాధురీణాత్మ వి
ద్యాసంయుక్త విభాసమానగుణ సంధామ్రవ వంగేశ్వరా
భ్యాసంబొప్పభజింతు నీపదయుగం బర్థిన్ సతంబు న్భవ
ద్దాసుం డేనుయటంచు వీరహనుమంతా భక్తచింతామణీ॥ 1

శా॥ లోకం బద్భుతమొంద నెమ్మియి ధరాలోకంబు బూరించగా
నీకం దూరుపుకొండపైకిజని యావిఖ్యాతమా లోహితా
స్తోకాకారుని బాలభాస్కరుని సంతోషంబుచే మ్రింగగా
దాకన్నోర్చియితివౌర వీరహనుమంతా భక్తచింతామణీ॥ 2

శా॥ శాంతంబైన గుణంబుదాల్చియును యత్రాంతంబు సద్భక్త మ
తాత్యంతర్భావముల న్గ్రహించి తగ నెయ్యంబొప్పగన్వారి సు
స్వాంతంబు ల్ముదమొందుగోర్కులిడు నీసత్యంబు నెన్నంగ న
త్యంతంబయ్యె ధరిత్రిలోన హనుమంతా భక్తచింతామణీ॥ 3

శా॥ వందేయంచు భజింతు నీప్రపదముల్ వాగ్భూషణంబైన వి
ద్యం దే దెమ్మికదాల్తు జిహ్వపయి సంధానంబుగా నవ్విడం
దిందేహాయని వేడనిత్తువని నీదివ్యప్రభావంబు నా
నందంబొప్పగ విన్నవాడ హనుమంతా భక్తచింతామణీ॥ 4

శా॥ ధీరాత్ముండవు సత్యవర్తనుడవౌ దివ్యప్రభావుండవౌ
నీరేజాతకులాప్తతేజుడవు రాణింజెందు దేహుండవౌ
పారావార గభీరుడౌ యనుచు నిన్భావించుమర్త్యాళి హృ
త్సారాంభోజముల న్వసించు హనుమంతా భక్తచింతామణీ॥ 5

శా॥ సత్యంబాదుర్గు నీదు నమ్మతిని పీనంబౌతయైన న్నను
ల్లిత్యంబు న్దగనల్పె నేని రుజము ల్నిక్కంబుగామానుటల్
యత్యంతంబు భవత్పదంబులను శే హర్షంబుతో గొల్తు నా
న్నత్యాగంబున చెల్వమారు హనుమంతా భక్తచింతామణీ॥ 6

శా॥ ఘోరప్రేతపిశాచభూతగణ యనే ఘోరంబులే బాధలన్
భీతిన్ బెట్టినచో భవత్స్మరణ సంప్రీతి న్నవస్సేయగన్
హేతుల్ నిక్కములన్ స్వతంత్రకిరటుల్ యిమ్ముల్ తుల్యాల్ పాడి త
న్మాత్రస్థల్పుచు శ్రీపావు హనుమంతా భక్తచింతామణీ। 7

శా॥ పాపారణ్యకుఠారమై రుజల సత్పంకేరుహేభంబునై
ప్రాపై భీతిలతాలవిత్రమయి సద్భక్తౌఘమందారమై
యేపార న్బహుళప్రభావమహిమన్ యెందేని వర్తించు నీ
దాపుస్సేరితి గావు వీరహనుమంతా భక్తచింతామణీ। 8

శా॥ రాముండంప జవంబుతోడ వెస పారావారమున్దాటి యా
భూమీజాతను లంకలోన గని సమ్మోదమ్ము చేవచ్చి త
త్క్షేమంబంతయు జెప్పి తత్పతికి సంసేవాపరత్వైక సం
ధామత్వంబున మెచ్చు మీరు హనుమంతా భక్తచింతామణీ॥ 9

శా॥ నానారూపవికారరాక్షసుల సేనల్చుట్టుముట్టంగ వి
న్యానంబొప్పగనున్న సీతగని దైత్యోద్యానమ్మాదము న్పాపగన్
నేనేజాలుదు సెల్వొసంగుమని బల్మెయ్యంబుతోబల్కి తు
ద్ధానక్షాంతిదలిర్ప వీరహనుమంతా భక్తచింతామణీ॥ 10

శా॥ అల సుగ్రీవహితుండవై జనకజాతాధీశ భక్తుండవై
యుల్లక్ష వ్యాకులాంతకుండవయి మాసీశాది తేయప్రమూ
ఖ్యులచే వర్ణితదివ్యమూర్తివయి సద్యోద్భూతసత్యంబుచే
తలసద్భక్తుల్బ్రోచు వీరహనుమంతా భక్తచింతామణీ॥ 11

శా॥ యంత్రం బేటికటంచు భూతభయరుగ్మానీకము ల్బాపగా
వింత్రా నీదగుభూజలన్ననులు సేవిన్నాంజనేయంబనే
మంత్రంబున్పఠియించబాయు నిడుము ల్మరొత్యాళికంచుక్ భవ
త్తంత్రం బేమనిజెప్పవచ్చు హనుమంతా భక్తచింతామణీ॥ 12

శా॥ ఘనవాలోద్ధతిచేత రావణునిలంక స్వేచ్ఛతో భూతిరా
సినిగా జేసితివీర శౌర్యమున వాసిన్మీరగానట్టి నిర్
మన మొప్పార భజంచు లే సమయమున్నార్ జగత్రాణ నం
దన కారుణ్యముతోడగావు హనుమంతా భక్తచింతామణీ॥ 13

శా॥ ఘనమా నీకిది జాగుసేయుటలు నాకందోయికి న్గానుః
చిన జాలంటిగాదె దేవ యికనీచిన్నె ల్వేసర్ జూపుమా
మన మొప్పారభజింతు నీప్రపదపద్మం బాంజనీదేవి న
న్దనప్రాభశరీర వీరహనుమంతా భక్తచింతామణీ॥ 14

మ॥ అతిదీర్ఘంబులు నీదుబాహువుల పెంపాస్యంబు చంద్రుదిర
స్కృతిసేయందగు లోచనద్వయము నీతేజమ్ములన్నించు
శ్రీపతి సద్భక్తి దలిర్పు నెమ్మనము నీవాలాహతిగోత్ర సం
తతులైన న్వడిగూల్పవచ్చు హనుమంతా భక్తచింతామణీ॥ 15

మ॥ జలరాశిన్ యొకకుప్పిగంతునను రోసం బొప్పగన్ దాటి దిం
క్కులు భీతిన్వడకంగ నాదమిడి లంకాపురాసురౌఘంబుతో
మలబోలెన్వడి బట్టిగొట్టితివి నీవు నాత్యమందు భూత
లమందంతటుమించె ధాటి హనుమంతా భక్తచింతామణీ॥ 16

శా॥ శ్రీకంజాయతలోచనాబుధనుతా శ్రీరామభక్తాగ్రణీ
పాకారి ప్రముఖాది నిర్జరమనఃపంకేజముల్సమ్ముదా
నీకంబందగ నట్టి యుష్మదవితో నిన్నెన్న గన్సాధ్యమే
నాకంబందె భవచ్చరిత్ర హనుమంతా భక్తచింతామణీ॥ 17

మ॥ మునుసీవంగుళి వేగదీసికొని యాభూజాలికివ్వంగ బో
యి వయస్త్రైకత వృత్తశాఖలపయిన్ యింపొందగా నెక్కు
బాణనమల్ల వడి పెల్లగించితివి శుంభద్వ్యాసరాకారని
ఘనబాహాబాహాద్యమెన్న నౌను హనుమంతా భక్తచింతామణీ॥ 18

మ॥ నయమానోదయమూర్తివంచు నిను యన్నాళ్ళు యొంతైన
లేకను బత్తిక్చజయించుచుంటినిగదా కారుణ్యమేపై
నజూపనురా వేమిర బ్రోవ నీకు మరినేపాత్రుండగాదే రం
జనరూపాకుజనారి వీరహనుమంతాభక్తచింతామణీ 19

మ॥ భయముల్దీర్పగ నిన్నె వేడవలె శుంభద్వ్యానరాకారసీ
నయచాతుర్య గుణాదికారణము లెన్నంజాలుశక్తుండనే
నియతంబై తగుభక్తిభావమున నిన్నేనమ్మియున్నారనన్
దయతోనేలుము వీరవీరహనుమంతా భక్తచింతామణీ॥ 20

శా॥ శత్రుల్వెట్టిన బాధకున్వెరచి లోశంకన్భయభ్రాంతినే
యుక్తిశ్శక్తిగ లేరు మానవులు యీయుర్వీస్థలిన్ గంటి త
చ్ఛక్తిన్గ్రోల్దిగ నిన్ను నెమ్మనమునన్ సాధించిగోల్చెటిన
దృక్శక్తిజాలునటంచు వీరహనుమంతా భక్తచింతామణీ॥ 21

మ॥ భువిలో కొందరు గానలేక తగనీభూరిప్రభావంబుకో
తివటంచుం న్నుతియింపకుండిరను నేద్దేవా మదిన్మర్వక
న్భవదంఘ్రిద్వయము న్భజించెదను బ్రోవన్గోరి నిన్నే సదా
తివసద్భావమసాధ్యమెన్న హనుమంతా భక్తచింతామణీ॥ 22

శా॥ పంతంబేర భవత్కృపామహిమజూపన్వేగ రారమ్ము నా
చింతల్బాపగనీవె దిక్కనుచు నాచిత్తమ్మునన్నమ్మియ
శ్రాంతంబుందగ గొల్చుచుంటిగదా శాంతస్వభావంబున
త్యంతంబున్వహియించినట్టి హనుమంతా భక్తచింతామణీ॥ 23

శా॥ శుంభద్రామునిభక్తి నెమ్మనమునన్సొంపొప్పగన్దాల్చి సం
రంభంబున్దగవార్ధిగట్టుటకు నారంభంబుచేబూని నీ
జృంభంబు న్వెసజూపితౌర ప్లవగబృందంబులో మేటివై
దంభత్వంబున ధీర వీరహనుమంతా భక్తచింతామణీ॥ 24

మ॥ గ్రహసంఘాత లతావితానములవిత్రంబైన దివ్యవి
గ్రహసంకీర్తన జేసి ద్రుంచదగునారా నీప్రభావంబు నీ
మహి నెంచందగువారు లేరనుచు ముమ్మారు న్వాసన్పల్కెదన్
దహితారిప్రకటాగ్రవాల హనుమంతా భక్తచింతామణీ॥ 25

మ॥ మన మొప్పారగ పాత్రముల్మరియు నేమాన్యద్యగన్జేరి నే
ఘనమౌరీతివచింపలేదుగద నీకారుణ్యమేమిక్కిలై
దనరంగ న్విరమించినాడ నిదిగో తారావళిందాల్చుచు
న్ననతో మల్కాపురీనివాస హనుమంతాభక్తచింతామణీ॥ 26

శా॥ శ్రీ వైఘానససంతతిన్ మిగుల వాసిన్మీరుచున్నట్టి యా
శ్రీ విన్కొండకులాబ్ధిసోముడనగన్ శ్రీనారసింహుండనన్
శ్రీవిఖ్యాతగుణుండనంగి భువిలో చెన్నొంది నీపైన స
ద్భావంబొప్పగ వ్రాసినాడ హనుమంతా భక్తచింతామణీ! 27

సంపూర్ణము.

చంద్రికాముద్రాక్షరశాలయందు వెలకుదొరకు గ్రంథములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | సత్యహరిశ్చంద్రీయము. | ... ... | రు 1 | 0 | 0 |
| 2 | బుద్ధిమతీవిలాసము. | ... ... | 0 | 12 | 0 |
| 3 | సాత్రాజితీవిలాసము. | ... ... | 0 | 14 | 0 |
| 4 | చిత్రసాధనము. | ... ... | 0 | 12 | 0 |
| 5 | కీర్తికాంతాస్వయంవరము. | ... ... | 0 | 4 | 0 |

వలయువారు, మానేజరు.

చంద్రికాప్రెస్,

గుంటూరు.

అని ప్రాయించబడుచు.

